# కల్యాణ సంచిక

# కల్యాణ సంచిక



1952

*With The Best Compliments of:*

ప్రకాశకులు:

**శ్రీ రామా బుక్ డిపో**

సికింద్రాబాద్.

శ్రీయైనమః.

# పీ ఠి క.

—— :0: ——

"కల్యాణ పంచిక" యను నీ చిన్ని పొత్తము నందన వసంతమున నీ నగరవాస్తవ్యులును, శ్రీరామా బుక్ డిపో, యజమానులు నగు శ్రీ పబ్బా శంకరయ్య శ్రేష్ఠిగారి పుత్రికామణి యగు సౌ॥ నాగమణీ వివాహ మహోత్సవ కాలమున, సకల కల్యాణ వైభవోపేతమగు కల్యాణమండపమున విప్రాశీర్వాద ములతో, సుమంగళ వాద్యధ్వనులు సెలంగ సువర్ణాలంకృత మూర్తియై సముద్భవించిన 'కావ్యకల్యాణి'.

ఆ శుభసమయమున హైదరాబాదు, సికిందరాబాదు నగరములఁగల విద్వత్కవులు పెక్కురాహ్వానింపఁ బడి నూత్న వధూవరుల మంగళాశీః పూర్వక గీతాగోష్ఠులఁ బ్రశంసించిరి. ఆ గోష్ఠి కలాపసంకలనమే 'కల్యాణగోష్ఠి'యై విరాజిల్లినది. ఈ కల్యాణ గోష్ఠికి ప్రసిద్ధ పండితకవులగు శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగా రధ్యక్షత వహించి, జయప్రదముగా నిర్వహించిరి.

ఇట్టి గోష్ఠీ సంకల్ప సముద్యోగమునకు శ్రీశంకరయ్యగారు క్రొత్తగాదు. ప్రతి వత్సరాది యందును, పంచాంగ శ్రవణాదికము లొనర్పఁజేసి, జ్యోతిర్విద్యావిదులను, కవితాసమావేశమునఁ గావ్యగోష్ఠీ కలాప మొనర్పఁజేసి కావ్యకర్తలను నూత్న వస్త్రాలంకృతులఁజేసి సన్మానించుటవారిచేఁ బ్రకటితమైన 'ఉగాది'యను కావ్యసంపుటి చాటుచున్నది.

ఈ కావ్యనామ మొక విసూత్నముగాఁ గన్పట్టుచున్నను, నది ప్రాచీన సత్సంప్రదాయమును స్మృతి పథమునకుఁ గొని వచ్చుచున్నది మహారాజులు తమ యాస్థానము లందును, దేవతా మహోత్సవ సమయములందును, సంగీత సాహిత్య కళలతోఁ బాటు లలిత కళలకెల్లను గౌరవ సన్మానములొనర్చుట నాంధ్రదేశమునఁ బ్రసిద్ధిఁగొన్న విషయము.

కాలస్వభావము వేఱొందు మార్పును బొందుచున్నను, ఆస్తికులును, సద్ధర్మ నిరతులును, సత్కళా పోషకులును, పెక్కురు రసికులు గలరు అట్టివారిలో శ్రీ శంకరయ్యగా రొకరు. ఇట్టి ఉదారాశయుని, పెక్కు సత్కార్యము లొనర్చి, సత్కళా పోషణము సేయుటకునై పరమేశ్వరుఁడు చిరాయుష్మంతుని గాను, సకల శ్రేయోవంతుని గాను జేయుఁగాక యని కోరుచున్నాను.

సికిందారాబాదు,
సెకండు బజారు.
30-9-52

ఇట్లు,
వెల్లంకి వెంకటరమణయ్య,
(విద్వాన్)

# శుభ సందేశములు.

—— : o : ——

**శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్,** చెన్నపురి

"............వధూవరులకు చిరాయువును,
సౌఖ్యాభివృద్ధిని కాంక్షించుచున్నాము."

**మెసర్స్ ఓరియంటల్ లాంగ్మన్స్ లిమిటెడ్,** చెన్నపురి

"............దంపతులకు సర్వ సౌఖ్యాభి
వృద్ధిని కోరుచున్నాము."

**శ్రీ సీతారామయ్యగారు, "రూపవాణి"** చెన్నపురి.

"............దంపతులకు చిరతర సుఖ
జీవితము గలుగున ట్లాశీర్వదించుచున్నాను."

**శ్రీ జోస్యుల వేంకటేశ్వర్లుగారు, కొత్తగూడెం.**

"............శ్రీమన్నారయణ మూర్తి నూతన
దంపతులకు తన అభయహస్త మనుగ్ర
హించి, వారి అండనుండి ఆయు రారో
గ్యైశ్వర్యాభి వృద్ధుల నిచ్చుగాక" యని
నేను భగవంతుని ప్రార్థించు చున్నాను.

# మనవి

———— :o: ————

సికింద్రాబాదులోని శ్రీరామా బుక్ డిపో యజమానులగు మ॥ రా॥ శ్రీ పబ్బా శంకరయ్యశ్రేష్ఠిగారి కుమార్తె చి॥సౌ॥ నాగమణియొక్క వివాహము (ది. 11-5-1952 తేదీన) నందన వైశాఖ బ॥ ౨ లు ఆదివారమునాడు అతివైభవముగ జరిగినది. లోకులందరివలె శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగారు తన కుమార్తెకు భాగ్యవంతుడైన వరుడే కావలెనని పట్టుపట్టలేదు. "ఉన్నవాడు ఉన్నవానికే యిచ్చుట, లేనివాడును ఉన్నవానికే యిచ్చును" అను సామెతనుబట్టి భాగ్యవంతునికే వేలకొలది కట్నములు: కానుకలతో, కుమార్తెనిచ్చి పెండ్లిచేయుటకంటె, మర్యాదస్థుడును, విద్యావయోగుణ సంపన్నుడును అగు నొక సామాన్యస్థితిపరునకు తన కుమార్తెనిచ్చి సాలంకృత కన్యాదానమొనర్చుట తన కిహపర సాధకమగునని శ్రీ శ్రేష్ఠిగారి యుద్దేశ్యము. ప్రపంచములో ఎందఱు భాగ్యవంతులకిట్టి సద్బుద్ధి పొడసూపును? ఈ యుద్దేశ్యము ననుసరించి, శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగారు లింగంపల్లి గ్రామమందలి మ॥ రా॥ శ్రీ మాశెట్టి రాజలింగయ్యశ్రేష్ఠి గారిద్వితీయపుత్రుడు చి॥ రాజయ్యకు తనకుమార్తెనిచ్చుటకు నిశ్చయించుకొనిరి. ది. 5-5-52 తేదీన సికింద్రాబాదు (హైటర్ బస్తీలోని) శ్రీ సత్యనారాయణస్వామి గుడివీధి యందు గల "శ్రీరామాపిల్లా"యందు వధూవరుల పక్షములవారు సమావేశమై పరస్పరము తాంబూలములు పుచ్చుకొనుటయును, లగ్ననిశ్చయ మొనర్చుకొనుటయు జరిగెను. ఆ సందర్భమున శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగారు నూతనపద్ధతిగా, కాబోవు వియ్యాలవారికి ఉపాహారవిందేర్పాటు చేసిరి. తరువాత ది. 7-5-52 తేదీన లింగంపల్లినుండి శ్రీ మాశెట్టి రాజలింగయ్యగారు బంధుమిత్ర పరివార

సహితముగా సికింద్రాబాదునకు తరలివచ్చి ఫలపుష్పోత్స వమును మహావైభవముగా నిర్వర్తించిరి. ఆనాడు బంధుమిత్ర సంబంధీకులగు సువాసినీమణు లసంఖ్యాకముగా వచ్చి యుత్స వమున పాల్గొని, శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగారి యాతిథ్యమును గ్రహించి వెడలిరి. మరునాడు ఉదయము శ్రీ శంకరయ్యశ్రేష్ఠి గారు సబంధుమిత్ర పరివారముగా అరు బస్సులలో లింగంపల్లికి తరలిపోయి అచట మహానందముగా ఫలపుష్పోత్సవమునుసలిపి మరలివచ్చిరి.

అంతట చి॥ సౌ॥ నాగమణికి అనేక బంధుమిత్రులు ది. 10-5-52 తేదీన వధ్వలంకార మహోత్సవములు సలిపిరి. వానిలో కెల్ల శ్రీరామాబుక్‌డిపో మేనేజరగు శ్రీ నీలారాజయ్యగుప్త గారిచే జరుపబడినది మిక్కిలి వైభవోపేతముగా నుండెను. ఉపాహారమును, ఊరేగింపును, జనస్తుతి పాత్రముగా నుండెను.

మరునాడు, 11 వ తేదీన శుభలగ్నము. చిత్ర విచిత్రాం బర విద్యుద్దీపములచే నెంతో చక్కగా నలంకరింపబడిన పందిరి యందు నారికేళ కదళీ పత్రాదులచే నయనపర్వముగా సిద్ధపరు పబడిన కల్యాణ మండపము శోభిల్లుచుండెను. ఆహూతులై వచ్చెడి యతిథులకు శ్రమాపనయార్థమై విద్యుద్వ్యజనములు సభామంటపమున నటనట విసరుచుండెను. శుభలగ్న సమ యమునకుముందే పందిరి యంతయును క్రిక్కిరియునట్లు మహాజనులతోడను, పురంధ్రీమణులతోడను నిండిపోయెను. వశిష్ఠులగు నారాయణం రాజనరసింహ శాస్త్రిగారు చక్కగా మంత్రార్థానుసంధాన సహితముగా కార్యకలాపమును నడుపు చుండ, వారివద్ద నేర్పరుపబడిన దూరశ్రవణ యంత్రము (మైక్రోఫోను)ద్వారా, ఆ విషయమంతయును సభ్యుల కందఱ కును సునాయాసముగా వినబడుచుండెను. ఇట్టి సందర్భములో

మైక్రోఫోను ఏర్పాటుచేయుట కిదియే ప్రథమపర్యాయమని పలువురు సభ్యులు ప్రశంసించిరి.

లగ్నముకాగానె శ్రీరామా బుక్‌డిపో గుమస్తాల పక్షమున వధూవరులకు పద్యరత్నోపహారము సమర్పింపబడెను. శ్రీ ఆకెళ్ల సుబ్రహ్మణ్య కవిగారును, శ్రీ బచ్చు వెంకటేశ్వరగుప్తగారును తమ కమనీయపద్యసుమమాలలచే నూతనదంపతులనలంకరించిరి. వధూవరులకు పలువురు పురప్రముఖులచే వివిధ వస్తువులు కానుకలొసగబడెను.

ఆనాటి మధ్యాహ్నమున భోజనసమయమున శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్య కవిగారిచే దూరశ్రవణ యంత్రముద్వారా సుశ్రావ్యముగా "దేవి భాగవతము"లోని "దేవీస్తుతి" పఠన మొనర్పబడెను. భోజన సమయములందిట్టి మంచి యేర్పాటుచేయుటకును ఇదియే మొదటిసారియని పెద్దలు పలువురు సంతసించిరి.

వైవాహికమగు తదితర కార్యక్రమము చక్కగా నెరవేర్పబడుచుండెను. "తోటలు" ఊరేగింపు ఉత్సవము మహావైభముగా సాగెను. సదస్యము నాకబలి మున్నగునవి చక్కగా జరిగెను.

18 వతేదీ ఆదివారమునాడు సాయంకాలము ఈ వివాహమున కంతటికిని మకుటాయమానముగా నొప్పుచున్న "కల్యాణ గోష్ఠి" సాగినది. అద్దానికి సికింద్రాబాదు, హైదరాబాదు నగరము లందలి కవిపండిత ప్రముఖు లనేకులాహూతులై శ్రమయనక విచ్చేసిరి. ఉపాహారానంతరము జరిగిన మహాసభ నయనశ్రవణ పర్వముగా నుండెను. వధూవరు లలంకరింపబడి, ఉన్నత వేదికపై సుఖాసీనులయి యుండిరి. వారిప్రక్కన అధ్యక్షుల శాసన మేర్పరుప బడియుండెను. కారణాంతర వశమున హైద్రాబాదు

నగరమునకు ఆ క్రిందటినాడు విచ్చేసియున్న ప్రముఖకవి, విమర్శకుడు, గాయకుడు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ఆనాటి సభకు అధ్యక్షులుగా నుండుటకు శ్రీ శంకరయ్యశ్రేష్ఠిగారి పూర్వ పుణ్యవశమున దయతో నంగీకరించిరి. అధ్యక్షులను గురించి శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు పరిచయ వాక్యములనుచెప్పి సభా ప్రారంభ మొనర్పవలసినదిగా ప్రార్థించిరి. అంతట శ్రీ రామచంద్ర ఘనాపాఠిగారు శ్రీ వేదాంతం సుబ్రహ్మణ్యావధానులుగారును, శ్రీ శేషావధానులుగారును, వే ద మ ం త్ర ములచే వధూవరుల నాశీర్వదించిరి. ఇక, శ్రీ శిరోమణి శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ప్రభృతి కవివరేణ్యులచే నాశీర్వచన శ్లోక, పద్య, పరంపర కురిపింపబడెను.

కథానికలపోటీలో ప్రపంచ ద్వితీయ బహుమానముపొంది ఆంధ్రులకు, ఆంధ్రభాషకు నమిత గౌరవమునుగూర్చిన శ్రీపాల గుమ్మి పద్మరాజుగారు అనారోగ్యకారణమున వచనముననే వధూవరుల నాశీర్వదించిరి. అధ్యక్షులకును ఆశీర్వదన మొనర్చిన కవిపండితులకందరకును, శ్రీ శంకరయ్య శ్రేష్ఠిగారు తమ మేనమామగారగు శ్రీ చందానారాయణ శ్రేష్ఠిగారిద్వారా ఫల మాల్యాంబరాదులచే సత్కార మొనరింపజేసిరి. అధ్యక్షులు తమ ప్రారంభోపన్యాసమున, వివాహసందర్భములలో నిట్లు కవి పండితుల యాశీస్సులను గ్రహించి, వారిని సత్కరించు ఆచారము బహుశః ఇంధ్రదేశమందే కన్పట్టుచున్నదనియు, తాము సుమారు 40 సంవత్సరములక్రిందట నిట్టి గోష్ఠిని చూచియుంటి మనియును, ఆంధ్రులందిట్టి కవితాప్రీతి యుండుటవలననే వారియొక్క లక్షణ (అలంకార) గ్రంథములందు ఇతరుల గ్రంథము లందరికంటె శృంగారాది రసస్ఫూర్తి సంపూర్ణముగా నున్నదనియును, ఇట్టి గోష్ఠిపద్ధతి ఎంతో సంస్తవనీయమనియును మున్నగువిషయములను సభారంజకముగా ను ప న్య సిం చి రి.

కవితాగాన ప్రారంభమున శ్రీ పబ్బా శంకరయ్యా శ్రేష్ఠిగారి పక్షమున శ్రీ భీమవరపు సాంబశివ శర్మగారు మాటలాడుచు, స్థానికులగు కవులనందఱను ఆహ్వానించుటకు తమకు సాధ్యము కాలేదనియును, అంతమాత్రమున ఆహ్వానింపనివారిపై తాము నిరాదరణ చూపినట్లు భావింపవలదనియు, ఆహ్వానించినవారి పేర్లు జాబితాలో ముందు వెనుకలుగానుండుట తప్పనిసరి యనియు. అట్టి ముందు వెనుకలు కవిపండితులయొక్క యోగ్యతా తారతమ్యములనుబట్టి కల్పించినవి కావనియును, శ్రీ శ్రేష్ఠిగారు తమకు పరిచయులగువారిని వివాహ దినమున మర్యాదచేయుటకు వీలుండదుకాబట్టి అట్టి లోపమును తీర్చుటకును, పెద్దల యాశీర్వచనములను నూతన దంపతులకు ఇప్పించుటకును, ఈ కల్యాణగోష్ఠి ఏర్పాటు చేయబడినదేకాని, కవిపండితులను వారి సామర్థ్యమునుబట్టి సత్కరించుకొఱకు కాదనియును, సభ్యులకు స్పష్టీకరించిరి. శ్రీ పబ్బా శంకరయ్యా శ్రేష్ఠిగారు ఈ శుభసందర్భమున కొన్ని సంస్థలకు విరాళము లొసంగిరి. శ్రీ శ్రేష్ఠిగారి వశిష్టులగు శ్రీ నారాయణం రాజనరసింహ శాస్త్రిగారికి రు 216-0-0 లు కట్నము సభలో సమర్పింపబడెను. కవిపండితులయొక్క ఆశీర్వాదానంతరము శ్రీ చివుకుల అప్పయ్యా శాస్త్రిగారి యొక్కయు, శ్రీ భీమవరపు సాంబశివ శర్మగారి యొక్కయు కృతజ్ఞతా వందనములతో సభ జయప్రదముగా సమాప్తమయ్యెను. ఈ సభకుకూడ దూరశ్రవణయంత్రమేర్పాటు చేయబడుటచే కార్యక్రమము సభ్యులకందరకు చక్కగా వినబడెను. శ్రీ కె. సూర్యనారాయణశర్మగారి హాస్యరచన సభ్యులకు చక్కలిగింత పెట్టినట్లు నవ్వించెను.

ఇట్లీ వివాహ శుభమంగళ కార్యక్రమమును జయప్రదముగా జరుపుటకైన ఏర్పాటుచేయుటలో శ్రీ శంకరయ్యా శ్రేష్ఠిగారికి శ్రీరామా బుక్ డిపో మేనేజరగు శ్రీ నీలా రాజయ్యా గుప్తగారు

కుడిభుజమై సహాయమొనర్చిరి. పైన వర్ణింపబడిన ఏర్పాట్లు ప్రత్యేకించి "కల్యాణ గోష్ఠియును" నవీన పద్ధతిలో నడువబడి ఆనంద దాయకముగాను ఆదర్శ ప్రాయముగాను ఉన్నవని పలువురు పురప్రముఖులు ప్రశంసించిరి. ఇకముందు ధనికుల యిండ్లలో జరుగు వివాహములలోకూడ నీ పద్ధతులు ఇకముందు అనుసరింపబడగలదని ఆశింపబడుచున్నది. ఆశీర్వచనమునందు పాల్గొనిన కవిపండిత మహాశయులకును, ఇద్దానికి పీఠికవ్రాసిన శ్రీ విద్వాన్ వెల్లంకి వెంకటరమణయ్య గారికిని, ఇందు తోడ్పడిన బంధు మిత్రాదులకును కృతజ్ఞాపూర్వక వందనములర్పించుచున్నారము. తత్కవి పండిత నామములును, విరాళము లొసంగబడిన సంస్థల నామములును ఈక్రింద నుదహరింపబడినవి.

—— :o: ——

## విరాళము లొసగబడిన సంస్థలు.

1. శ్రీసీతారామనామసంకీర్తనసంఘము గుంటూరు రు.50-0-0.
2. ,, కన్యకా పరమేశ్వరి రు. 11-0-0.
3. ,, సికింద్రాబాదు వైశ్య యువజనసంఘము రు. 21-0-0.
4. ,, దివ్యవాణి రు. 11-0-0.
5. ,, ఆంధ్రసంవర్ధని గ్రంథాలయము రు. 11-0-0.
6. ,, రాజశ్రీ కళాపీఠము రు. 11-0-0.
7. ,, కంజరిగూడ ఆయుర్వేద నిలయం రు. 11-0-0.
8. ,, మడూరి రాఘవులు భాషాకల్పవల్లి రు. 11-0-0.
9. ,, త్యాగారాజ గానసభ రు. 11-0-0.
10. ,, పరోపకారిణీ లైబ్రరీ, ఖండోజి బజారు, రు. 11-0-0.

11. ,, రాయలసీమ జ్ఞానవిధి (సికింద్రాబాదు మేయరుగారి ద్వారా) రు. 11-0-0.
12. ,, లింగంపల్లి గ్రంథాలయము రు. 11-0-0.
13. ,, సికింద్రాబాదు అనాథ శరణాలయము రు. 11-0-0.

—— :0: ——

# ఆశీర్వచనమున పాల్గొన్నవారి నామములు

1. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు. అధ్యక్షులు.
2. ,, సరిపల్లి విశ్వనాథ శాస్త్రిగారు.
3. ,, రామచంద్ర ఘనాపాఠీగారు.
4. ,, వేదాంతం సుబ్రహ్మణ్యముగారు.
5. ,, శేషావధానులు గారు.
6. ,, కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు.
7. ,, ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు.
8. ,, నారాయణం రాజనరసింహ శాస్త్రిగారు,
9. ,, గాదిరాజు యజ్ఞనారాయణగారు.
10. ,, జె. అమరనాద శాస్త్రిగారు.
11. ,, మేడిపల్లి లక్ష్మీకాంతయ్యగారు.
12. ,, సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు.
13. ,, కేశవ పంతుల నరసింహ శాస్త్రిగారు.
14. ,, చివుకుల అప్పయ్య శాస్త్రిగారు.
15. ,, మల్లాది వీరరాఘవ శాస్త్రిగారు.

16. ,, కె. సూర్యనారాయణ శర్మగారు.
17. ,, వెల్లంకి వెంకట రమణయ్యగారు.
18. ,, యన్. సి. యస్. పార్థసారధి గారు.
19. ,, యన్. సి. యస్. వేంకటాచారి గారు,
20. ,, ప్యారకం సీతారామాచార్యులు గారు.
21. ,, నాగం కృష్ణారావుగారు.
22. ,, ఆకెళ్ళ సుబ్రహ్మణ్యముగారు.
23. ,, ఆదిరాజు వీరభద్రరావుగారు.
24. ,, చిగురుపాటి సుబ్రహ్మణ్యముగారు,
25. ,, దాశరధి కృష్ణమాచార్యులుగారు.
26. ,, పాలగుమ్మి పద్మరాజుగారు.
27. ,, నటరాజ శర్మగారు.
28. ,, బలభద్రపాత్రుని శ్రీ కృష్ణారావుగారు.
29. ,, శిరోమణి విశ్వనాథ శాస్త్రిగారు.
30. ,, నిత్యానందముగారు.
31. ,, బచ్చు వేంకటేశ్వర గుప్తగారు.
32. ,, భీమపురపు సాంబశివ శర్మగారు.
33. ,, వేముగంటి నరసింహాచారిగారు.
34. ,, ఉప్పుల చంద్రశేఖరం గుప్తగారు.

ప్రకాశకులు.



నూతన వధూవరులు శ్రీ నాగమణి రాజయ్య గార్లు,

శ్రీ

# కళ్యాణ సంచిక

---

శ్రీ నీలా రాజయ్యాగారు జరిపిన వధ్వలంకారోత్సవములో

రా. సా. కళాపీఠ కార్యదర్శి

## శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్యకవిగారి

## అభినందనలు

నీదు యజమానిపైగల నిర్మలంపు
ప్రేమ తార్కాణమియ్యది రేయిబవలు
నీదువిశ్వాస మూయలై నేటిదినము
ఈ వధువు అలంకార మెంతెంత కాంతి!

నీల రాజయ్య నీశుభశీలగుణము
నాగమణి వివాహోత్సవ నాటకమున
అందచందాలనాంది నానంద మొంద
సూత్రధారుడవై పాడి చూపినావు!

పచ్చ శంకరశ్రేష్ఠి యీ వరుసజూడ
నేంతవైభవ మీపెండ్లి నిడునొనీదు
ఉజ్వలోత్సాహమే గుర్తునొసగె మీకు
శివకరమ్మగుగాత! వాసెలుత యశము!

---

శ్రీరస్తు.

చి॥ సౌ॥ నాగమణి, చి॥ రాజయ్యల వివాహ మహోత్సవ
సందర్భమున సికింద్రాబాదు శ్రీరామా బుక్ డిపో
గుమాస్తాలచే ప్రేమాశీర్వాద పురస్సరముగా
నొసంగబడిన

# పంచరత్నములు

—:o:—

## శ్రీరామా బుక్ డిపో గుమాస్తాలు

శ్రీవాణీ కమలజులు, ర
మావిష్ణు, లుమాశివుల్ సమస్త సుఖైశ్వ
ర్యావిర్భూతి నిడి నవ వ
ధూవరులను చిరము మనుచు దురుగాత నిలన్.

వేడ్కఁ దలఁబ్రాలు బోసెడివేళఁదోఁచు
సంతసము, ప్రేమ, కార్యదీక్షయును, భావి
జీవితమునందు పెనఁగొని చెలువుఁగొలుప
నందుడీ గార్హపత్య సౌఖ్యానుభూతి.

చిఱుతలయెడ వాత్సల్యము,
గురు పతి దైవతములందు గురుభక్తియు, నీ
పరిజనమునందు దయయుం
బరగఁగఁ గాపురము జరపుమా! నాగమణీ!!

దానము, ధర్మముఁ, దయయు,
దైవ గురు ద్విజభక్తి, సత్యముఁ
జ్ఞానము, శాంతి, దాంతి సద
సత్సువివేకము, మున్నుగాగ నిం
పైన గుణంబులఁగలిగి
మామనుగెల్వుము సచ్చరిత్రమం
దో నయకోవిదా! నిజవ
ధూమణి నాగమణీయుతుండవై.

వధువు నాగమణి సుశీలవతి, హితమతి
వరుఁడు రాజయ్య సద్గుణాకరుఁ డమలుఁడు
అవని వీరల దాంపత్య మలరుత చిర
మతి సుఖాయురైశ్వర్య సంతతియుతమయి !

కం॥ మీరుభయులు సతిపతులిల
కరుణాళు మహాత్మగాంధి, కస్తూరిసతీ
సరణిన్, బీదలబ్రోచుచు
పరమేశ్వర కృపను మనుడు, పౌరుషకీర్తిన్.

ఆకాంక్ష!

కం॥ వైశ్యుడవై పుట్టుటచే
వైశ్యుల సంఘంబుగూడ, వర్ధిల్లుట యా
వశ్యకమని, శపథించిన
పశ్యత్వాలుండునైన, పాటించుసుమా!

నందన వైశాఖ బ॥ ౨,
౧౧-౫-౫౨ ఆది.
సదాశివపేట.

ఇట్లు,
బి. వెం. గుప్త, హైకోర్టువకీలు,
పూర్వ జిల్లాకాంగ్రెస్‌కమిటీ అధ్యక్షులు.

శ్రీ శుభమస్తు.

**18-5-52 తేదీని జరిగిన కళ్యాణగోష్ఠిలో జదువబడిన**

# ఆశీః పద్య రత్నములు

—— :0: ——

## శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు

కం॥ శ్రీరమణీ గౌరీపతు
లారోగ్యము, సుతులు, చిరతరాయువు, సుఖముల్,
శ్రీ, రంజిల్లఁగ, "నాగమ
ణీ రాజులఁ" బ్రోతు రెలమి నిరతముఁ బ్రీతిన్.

సీ॥ పలువన్నెలందేలు నలరుగుత్తుల నేత్ర
పర్వంబుగాఁ గళల్ పర్వఁజేసి;
భృంగీగణంబుల సంగీతరవములఁ
గోర్కి తీవెల విరుల్ గూర్చుచుండి;
మత్తపికాంగనా మంద్రస్వరంబులఁ
బ్రణయగీతంబులు పాడుచుండి;
తీవెకన్నియఁ దియ్యమావికౌఁగిటఁ జేర్చి
తరుణతాపాతంబుఁ గలుపుచుండి;

గీ॥ దక్షిణానిల తాళవృంతముల వీచి
కొలువు సేయుచు నామని కొలువుకాఁడు
సరసముగ "నాగమణి రాజవరుల" నెలమి
నెలయఁ జేయుత ప్రేమడోలల సతంబు.

చ॥ జిలిబిలి ముద్దుపల్కులను
జిందులుద్రొక్కుచుఁ దల్లిదండ్రులన్
వలపులఁగూర్చుచుం బ్రణయ
బంధములై తగు ముద్దుబిడ్డలన్
బలువుర దంపతిత్వ ఫల
భాజనులన్ గృహదీప పంక్తులన్
వెలయఁగఁగాంచి, "రాజవరు"
ప్రేమను గొల్లఁగఁగ్రోలి, సర్వసౌ
ఖ్యలహరిఁదేలి, సంపదల
కాకరమై, ద్విజ దేవ వైదుషీ
నిలయ కవీశ్వరాతిథుల
నిచ్చలుఁగొల్చి సపర్య సేయుచున్
మెలఁగుమ! పుట్టినింటికిని
మెట్టినయింటికిఁ గీర్తిగూర్చుచున్
సలలితశీలవై జనక
జాదమయంతు లహల్య మున్నుగా
వలరు పతివ్రతామణుల
భారతనారుల నొజ్జబంతిగాఁ
గొలుచుచుఁ "దండ్రికిం దగిన
కూఁతు" రటన్న యశంబుఁగాంచి, నీ
వలపుల పెన్నిధానమగు
వల్లభునిన్ మనసంటఁగొల్చి ని
త్తులగృహజీవనావఁ ధుల
దూగుము రాజమణీ! సుఖంబుగన్.

---

# ఆశీస్సు

—— :o: ——

సేసల నింపుకొన్న చంపవు.

## విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారు, ఎం. ఏ.

శ్రీల సిరులందగించు శరత్పూర్ణిమ వెన్నెల వెల్లులనీడల, నభ్యాసవశమున జూడనై, తెల్లని మంచుమలవలె, మన్నతుఁడు, గంభీరుఁడునై, వృషభేంద్రుడు నందీశ్వరుఁడు కైలాసగిరి ప్రవేశద్వారమున, ముక్తపద్మాసనాసీనుండై, తనకనుసన్నల, గణపతిం దొట్టిగణానీకముల నిశ్శబ్దముగ నిల్వరించియున్నాడు. సమయము ప్రదోషము. ముక్కోటిదేవతలు నందీశ్వరునకు నతులంజలించి శిరములువంచి, కైలాసగిరి నంతర్మందిరమునం బ్రవేశించిరి. నటరాజమూర్తి, మందమారుతమునకు సుధామయకాంతులు దిక్కులునిండుకొన, నల్దిక్కుల భుజశాఖలంగుళిచివురుల నల్లలనాడ, నమరతరు రాజసంపద వెల్లివిరియ నటించుచున్నవాడు. అంబిక, శంకరు, భక్తవశంకరు, నర్ధతను మూర్తి నాశ్రయించినదగుట సుందరేశ్వరు నాట్యమున నడుగులో నడుగిడుచున్నది. ఎల్లెడ మందహాసచంద్రికలు భక్తతకోరిక లాహరించ నమవేర్పడినది. ఆ ప్రశాంత వాతావరణమున, మహాభూతసంఘాతము విరిసిన నవ్వుల మొల్లలపూలు సింగారించుకొన్నది. అష్టమూర్తి నేత్రత్రితయముతోబా టంబిక ప్రత్యేకమూర్తి కందోయిని, నిండుకొన్న ప్రసాద నిర్మలదృష్టి ప్రసారాసారముల ముత్తియంపుఁబూలు ఈ వధూవరుల కరాంజలుల

నుంతిజారి, బాల్కొని, యొండొరుల శిరములంబడు పూలం గలసిన తలబాలల నిండుకొనుగాక. ఆ అమరతరుమూర్తికి కళలనిండిన పదునారు నమలషయసు. ఆ కుమారుడు నవపంచదశ షోడశమూర్తుల కంబికకుద్దిగా సదా కుమార యౌవనమూర్తియై యీ నూత్న వధూవరులకు దీర్ఘాయువు, నిండుజవ్వనము, సడలని ఆరోగ్యము అక్షయమ్ముగ మంగళముల నిచ్చుగాత. భావి ఆయుర్వృద్ధుల సుఖస్వరూపంబైవ సత్సంతానము నభీష్టసిద్ధులను జేకూర్చుగాత.

అర్ధనారీశ్వరమ్మైన అమరతరువు
నాగమణి రాజరాజయ్యె నవవిధముల
నిల్పు భక్తిభావములకు నిలచియింట
సకల కల్యాణసుమము లొసంగుగాత.

శ్రీరస్తు.

# వైవాహికాశీర్వచనము

—— :o: ——

## ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు

ఆర్యా—శ్రీపరిరంభితవిష్ణుః
వాగ్దేవీచుంబితోష్ఠ చతురాస్యః
శక్తిపరివేష్ఠితశివః
వధూవరాభ్యాం దిశంతుశుభముచ్చైః

ఆ—నళినీబాంధవముఖ్యాః
నవగ్రహాశ్చ నవగ్రహాస్సతతం
పౌలోమీశప్రముఖా
స్సుముఖాస్సుఖయంతు దిగధిపాశ్చైతౌ.

ఉ॥ పబ్బమనంగనుత్సవము పట్టుపువంగడమందు మేల్సిరుల్
ప్రబ్బజనించిభవ్యగుణ భాస్వరుఁడైతగు శంకరయ్య పె
ల్లబ్బురపుం గుమారియగు హర్షిణి నాగమణిన్ లసన్మణిన్
లిబ్బివలెన్ గ్రహించితి భళీ యిఁకవర్ధిలుమయ్య రాజయా!

కం॥ మణులును రత్నములును జయ
చణుఁడగు రాజొందినట్లు సమధికతేజో
రణి నాగమణినిఁ బొణిం
గుణనిధి రాజయ్యయొందె కుతుకంబలరన్.

చ॥ అల జలజాప్తునందుఁ బ్రభ
యాతిశయమ్మున నొప్పుచాయ, తా
గిళ నమృతాంశునందెనఁగి
యింపుఁదలిర్ప రహించుచాంద్రి, య
ఖ్లిలసముమీఱ నబ్దమున
నేమఱకన్‌దగు శంప, వోలె నీ
వలరుము రాజయార్యమణి
యందిఁక నాగమణీ! చిరంబుగన్.

చ॥ కడఁగి వసంతమాసమున
ఘుమ్మనఘుమ్మన సౌరభమ్ములన్
గడువడిగుప్పు బాలసహ
కార ధరమ్మును నల్లిబిల్లిగా
పడిఁబెనవేసి మేల్మితలఁ
బ్రాలువలెన్ విరిబారురాల్చి సొం
పడరెడు మాలతీలత యో
యారముఁ జెందితివమ్మ బాలరో!

చ॥ చిలుకయు గోరువంకవలె
చెన్నలరారెడు వైభవంబునన్
జలితపు ప్రేమబంధమునఁ
బాయక యొండొరు లింపుసొంపు చె
య్యుల ననురాగపుంఖరముఁ
బూవ మ నిచ్చలు హర్షపారవ
శ్యులరయి వృద్ధిగాంతురుత్తమ
హోన్నతిమీరిఁక నూత్నదంపతుల్!

తే॥ విభునితో సర్వసుఖముల విస్తరిల్లి
పుత్రపౌత్రులనొంది నీ పుట్టినట్టి
వంగడమునకు చేరిన వంగడమున
కతుల మోదమ్ము సమకూర్పుమమ్మ! బాల!

తే॥ నీదు నవరత్నభూషణ నికరమందు
నీ సువర్ణాఢ్యనవరత్న హృద్యమాలి
రహిని౸ గైసేయుమమ్మ విరాజమాన
భూరితర దివ్యకాంతులు పొదల దిశల.

---

శ్రీమత్పరదేవతాయైనమః

సౌ॥ నాగమణి, చి॥ రాజయ, వధూవరుల వివాహోత్సవ

# నవరత్న పద్యమాలిక

## గాదిరాజు యజ్ఞనారాయణరావుగారు

సిరికి హృదయంబొసంగిన శేషశయను
డిచ్చు సర్వంబు నమరుల కిచ్చునటుల
నిత్య కల్యాణమొసగి రాణింపజేయు
గాత నీదంపతులకు నెక్కాలమందు.

మల్లెలుమొల్లపందిళుల మాటునడాగి యధేచ్ఛనాటి జా
బిల్లినివెక్కిరించి ప్రతిబింబము నీటనుజూచినవ్వు నా
ఖిల్లునిరాణి శాంభవి లభించెనటం చెకసక్కెమాడి సం
ధిల్లగజేయుశంభుడు యధేచ్ఛను వీరలగాచునిత్యముల్.

శ్రీ లలరారుగావుత విశేషము పెండ్లికుమారునింట భృం
గాలకు లేతవన్నెజిలుకందగు లేజిగురాకుపోల్కి నా
బాలమెరుంగు, రాజయ కృపామయుడన్నిట శాంతమూర్తియే
కాలమునందు నాగమణి గాంచుత ప్రేముడి నన్నివేళలన్.

పట్నవంశానబుట్టి సంబరముగూర్చి
పుట్టినిల్లాట నికముందు మెట్టినింట

భర్త సేవించి సత్కీర్తి బడయుగాత
నాగమణినీవు దీవన నందుమమ్మ.

అత్తమామలనెరిగి పైవారినెరిగి
భర్తమనసెంచి సేవించి కీర్తి వకయు,
మమ్మ మీ అయ్యశంకరు నమ్మికలను
నీవు నిజపంగవలెమంచి త్రోవనడచి.

వెండికొండనున్నట్టి దంతవేల్పు
నరసి బిచ్చాలరాజు పీఠంచునగెడి
పార్వతీదేవి మీముగాచు జహుముదంబు
గాను దయజూచు నిత్యరాగాలయందు.

సురలనుగావ పీడ్వడిననుంపరియైు వెలసిల్లినట్టి యా
కరివరదుండు నాగమణిగాచును రాజయనుద్ధరించి సం
బరమునుగూర్చునేడు కవిభానులదీవన లుల్లసిల్లెనా
కరమునగూడుదంపతుల కాలము చాలగ కీర్తివంతమై.

సరళ హృదయాలతోడ సంసారనౌక
నడుపుచుందురు ముందరినాళ్ళలోన
తోడునీడగనుండి కైతోడుగాగ
చిలుక గోర్వంకలట్టులీ చిన్నిజంట.

సకల సౌభాగ్యముల నందజాలుగాత
నాగమణి రాజయులు ప్రేమ నాటుకొనగ
లేతహృదయాలు తీయని పూతపూయ
మధురజీవనయుగళమై మనలుగాత.

---

శ్రీరస్తు.

# ఆ శీ ర్వ చ న ము

:o:

## విద్వాన్ జె. అమరనాథశాస్త్రిగారు

తే॥ గీ॥ అమ్మ నీతండ్రి విబుధాళి సమ్మతుండు
నీమతల్లియు సౌశీల్య నిర్మలాత్మ
నీదుతాతలు నుపకార నిరతులెపుడు
ఇన్నిగుణములఁ బతిగూడి వన్నెదెమ్మ.

—

శ్రీ పరదేవతాయై.

# ఆశీః పద్యరత్నములు

—— :o: ——

శిరోమణి

## శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

కం॥ సిరి మెఱుపై చెలువందగ
నురంబునఁ, జకోరములయి యొప్పఁగభక్తుల్
నిరతము శివములు గురిసెడు
వరమేఘుఁడు మన్నుతను నవవధూవరులన్.

శా॥ నిచ్చల్ తామరదంపరై వెలయఁగా
నీయిల్లు, శ్రీశుండు నీ
కిచ్చున్ బట్టినదెల్ల బంగరముగా
నేకోత్తర శ్రీలిడన్
మెచ్చన్ లోకము నీయదృష్టమునకున్
వేయేండ్లు ముత్తైదువై
పచ్చంగా మనుమమ్మ నాగమణి! యా
పన్నార్త చింతామణీ!

సీ॥ తావకప్రియుని సుందరరక్త బింబంబె
సలుపుకొమ్మాదర్శ ఫలకముగను
త్వత్ప్రతిసరస ముగ్ధకటాక్ష వితతినె
దాల్చుమీ భూషాప్రదానముగను,

భవదీయపతికీర్తి యువతిరత్నంబున
చెలిమికత్తియనుగా సలుపుకొమ్మ.
త్వన్నాథు సద్గుణఘట్టంబె విరవిహా
రోద్యానసీమగా నుంచుకొనుము

గీ॥ త్వన్మనోహరుఁగూడి సత్కవి కవిత్వ
పుష్పరథముల విహరింపఁబొమ్ము! తల్లి,
దీనజనకల్పవల్లి! సతీమతల్లి!
అమలగుణములబావి నాగమణిదేవి!

మ॥ చెలి! నీచెంత నిలంబడన్ దమవలెన్
జేదోడువాదోడుగా
బల, ముత్సాహము, సాహసం, బినుమడిం
పన్ దీప్తతంబొంది ని
చ్చలు దేశీయహితోద్యమంబులకు ని
స్వార్థుండవై నీధనం
బులు వెచ్చింపుము, రాజయ్యా! నిలుపుమా
భూచంద్రముంగీరితిన్.

గీ॥ సుప్రియంబు, సుహృన్మణి, చుట్టములును
విధివిధానంబు, జీవనౌషధముఁ, బృథివి
నగుదురు పరస్పరంబు రాజయ్య! నీకు
నీ వధూరత్నమును నీవె; నీకు సతము.

శ్రీరస్తు.

# ఆశీర్వచనపద్యరత్నములు



## విద్వాన్ మేడిపల్లి లక్ష్మీకాంతంగారు

నాకవనమున కిలసాటి నాకవనము
నాకవన ప్రసూనంబులు పీకవనము
సతము, శుభమగు, నూత్నదంపతులుగాన
శిరమునందాల్చుడీ శుభాశీస్సుమావి.

సర్వసౌభాగ్యసంపద సమితితోడ
పుత్ర పౌత్రాభివృద్ధిని పొందివెలయు
పార్వతీ పరమేశుల పగిదిడదమిని
నాగమణియు రాజయ్యయు భోగములను.



శ్రీ పరమేశ్వరాయనమః

శ్రీ శంకరపుత్రికా వివాహ కల్యాణగోష్ఠిలో
బహూకరింపబడిన

# పద్య నవరత్నమాల

---

దివ్యవాణి పత్రికా సంపాదకులు

## శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు

శ్రీ శుచిపుండు బ్రాహ్మణుఁడు సెప్పినమాటల నాలకించి వే
చేరి విదర్భరాజపురిఁ జేది నరేంద్రుజయించి రుక్మిణిన్
ద్వారకఁజేర్చుచున్ విధివిధానముగా నుపయామమాడి చె
న్నారెడి శౌరి రాజయను నాగమణిన్ గృపతోడ నేముతన్.

నాగశయాన ప్రస్తుత
నాగాభరణుండు సుమిధు నత్యున్నతులౌ
నాగమణీ రాజయులన్
భోగ చిరాయువులొసంగి ప్రోచుతసతమున్.

అయ్య! మాశెట్టిరాజయ్య! యవధరింపు
మాకరముబట్టి వెన్నుఁడు మానవోత్త
ముఁడయినట్లు మా శంకర పుత్రికరము
బట్టి మాశ్రేష్ఠిరాజువై ప్రబలితౌర!

ధర్మార్థకామ సాధనములఁ 'నాతిచ
రామి' యఁ బ్రతిన దిరంబుసలుపు
పరధన పరసతీ పరపీడనాదుల
వైపు బోసని గట్టిపట్టుఁబట్టు
వేదశాస్త్రోదిత విటఁ ధర్మములఁజేయ
శ్రద్ధతో భక్తితో సలుపుచుండు
నీయభివృద్ధికై నిత్యంబు శ్రమియించు
బుధవరేణ్యులకు గైమోడ్పుచేయు

తల్లిదండ్రుల శ్వశురుల ధార్మికులను
దగినయట్టుల సేవించి దైవకృపను
ఆయురారోగ్య భాగ్యంబు లతిశయింప
దిగ్దిగంతరకీర్తివై తేజరిలుమ!

ఆర్యోత్తంసమ! గేస్తువైతివిగదా యామ్నాయ రామాయణా
ద్యార్యగ్రంథ హితోక్తి యుక్తివిని నీ యర్ధాంగినిఁ గాంచుమా
మర్యాదా పురుషోత్తముండు సతిసీన్ మన్నించినట్లో సుధీ!
'భార్యామూల మిదంగృహ' మ్మనెడి పూర్వన్యాయ
మాలింపుమా!

అమ్మా! నాగమణీ! యిటుల్ వినుము బా
ల్యక్రీడలఁ మాని య
త్తమ్మన్ మామను సేవలన్ దనుపుమా!
ధర్మావిరుద్ధార్థకా

మమ్మున్ జానకిదేవివోలె గయికొ
మ్మా ! భర్తకున్ లొంగుచున్
శమ్మున్గూర్పుమ ! నేర్పునన్మెలగుమా !
సాధ్వీలలామంబవై.

శంకరుపుత్రికన్ స్నుషగ శంకరసత్కృప జేసికొంటివే
శంకయులేక మాకిపుడు సంబరమయ్యెను ముందు మీరలే
వంకయుబెట్టబోక సుతభాతిని బ్రీతినిజూచి సంస్తుతిన్
బొంకపడంగజేసి యశమున్ గొనుమో సుధి ! రాజలింగమా !

శ్రీ చంద రామనశ్రేష్ఠి మేనల్లుండు
శివరాజ పుత్రుండు శ్రీయుతుండు
చందనారాయణ సద్భాగినేయుండు
శివరామ, శివరాజ, శివలతండ్రి
శ్రీరామ బుక్డిపో శేఖరుడు శకుంత
లానాథుడు బంధులాలసుండు
దివ్యవాణీపత్రి భవ్యకాముండును
గీర్తిత శంకర కింకరుండు

నైన పబ్బువంశజ శంకరయ్య 'మునిము'
నీలి రాజయ్య తోడ్పాటు నెగడుచుండ
మిత్రబుధచంద్ర గురుకవి మిళితమగు సు
ధర్మయన నిట్టిసభజేసె దక్షులలర.

మంగళమో నాగమంబ !
మంగళమో రాజయార్య ! మునిబంధులకున్
మంగళము నీకు శంకర
మంగళమో రాజలింగ ! మాధవకరుణన్.

చివుకుల అప్పయయను భూ
దివిజుఁడు నవరత్నమాల దీవ్యద్భీమ
త్కవి బుధ గురు హిత విహిత
ప్రవిమల కల్యాణగోష్ఠి బహుమతిగ నిడెన్.

శ్రీరస్తు.

# ఆశీస్సు

—— :o: ——

## మల్లాది వీరరాఘవయజ్వాగారు

మల్లాద్ప్యుపనామక వీరరాఘవయజ్వ ప్రదత్తేయం
నూతనవధూవర శుభాశీర్విజయతే తరామ్

వివాహో వైదికో ధర్మః సర్వధర్మోత్తమోహిసః
తమాచరంతియే యుక్తాః తేనూనం సుఖభాగినః॥

దీర్ఘాయుష్యంచ మైత్రించ సుపుత్రత్వ మరోగతాం
దద్యుస్సర్వే లోకపాలాః వధూవర సుపూజితాః॥

మహేశ్వరో మహైశ్వర్యం బ్రహ్మబ్రహ్మణ్యతాంతథా
నారాయణో ధర్మసుతః దంపత్యో శ్శం ప్రయచ్ఛతు॥

గౌరీదద్యా త్సుసౌభాగ్యం స్వాహాదేవీ సురూపతాం
ప్రయచ్ఛత్వ ప్రతిహతాం పతిభక్తి మరుంధతీ॥

పద్మావంశాబ్ధి సంభూతా మణిరేషాతుశాంకరీ
భూయాద్దత్తప్రసాదేన ధరిత్రీ ధర్మసంతతేః॥

——

# ఆశీర్వచనము

—— :o: ——

## దాశరథి కృష్ణమాచార్యులుగారు

స్ఫుటిత స్ఫుట భావర్కో
త్కట తను; పపరాద్రి సాను తటనటన రటత్
కటకుడు: జటాటవీ సం
ఘటిత సురాపగుడు మిమ్ము కాచెడు గాతన్

హిమవద్గిరిజా కంకణ
కమనీయ ధ్వనులు గడ్డకట్టి కవితయై
సమయానుకూలముగ మరి
అమరాపగ వోలె పొంగు నవి మిము బ్రోచున్

మీ కాశీస్సుల నందజేయుటకు సుమ్మీ! ఆంధ్ర సారస్వత
వ్యాకోచాంబుజ గర్భ గుంజదళి గేయంబైన గీతంబులన్
శ్రీకంఠాది కుమారికా పదములన్ చింతించి పితెంచినా
నాకాంక్షించెద పబ్బ శంకరుని కత్యంతాయు రారోగ్యముల్

నాగమణి వివాహమునకు నాగభూష
ణుని కృపాలబ్ద కవితా మణులను తెచ్చి
కానుకగ నిచ్చుచున్నాను కైకొనుండు
నిత్యమగుగాక మీకు దాంపత్యశోభ.

ప్రాణముగా తెలుంగులకు వర్తిల, మా కవుతెల్ల మంచి మా
గాణముగా స్తుతింప నవకావ్యములన్ పలికించు నా తెలం
గాణము మూడుకోట్ల తెలుగన్నలగన్న మహాంధ్రకాంత నా
ర్యాణము మీకు రక్షకముగా పలిసిల్లుసుగాక యొల్లెడన్

శ్రీ శుభమస్తు.

# ఆశీస్సు

—— :o: ——

[illegible] వెంకటరమణయ్య

శా॥ శ్రీయుక్ వైభవముల్ చెలంగ, ప్రీతి సంప్రీతిన్ విలోకించి సో
భాతీలన్ విహరించు దంపతులు శర్వాణీ మహాదేవులా
యాలీలన్ శుభముల్ బొనర్చెదని దీర్ఘాయుష్య సౌభాగ్యముల్
దేలంజేయుచు నూత్న దంపతుల కెంతే సర్వకాలంబులన్॥

కం॥ మీవంశ గౌరవంబుల
కావంతయు కొఱతలేని యట్టి విధంబున్
గావింపఁగ యత్నింపుఁడు
భావంబున ధర్మపథము వఱచుచు మిగులన్॥

తలఁప గృహస్థ మార్గమది తక్కినవానికి నెల్ల మేటి యౌ
వ్వలనన గాంచినన్, సకల భాగ్య సుఖానుభవంబు లెంతయున్
వలను పడంగ నౌను, ఋజువర్తన మొక్కటి దృష్టి బాయకన్
మెలఁగుటె కష్టమించుక సుమీ! యది నేర్పుడు మీర లెప్పుడున్

——

శ్రీ శుభమస్తు.

# పంచ రత్నములు

—— : o : ——

## యజ్. సి. యస్. వేంకటాచార్యులు

( శతావధాని. 18-5-52 )

శ్రీ కన్నెగల మేర మీఱఁ జొరఁ; దర్థిఁ భార్యలఁ బోయుఁదా
నే కాలంబు నొకం; డొకండు సతిసోదే గాని వేఱేమియుఁ
లేకుండుఁ; జగదాది నాయకుల యీ లీలా విలాస ప్రభల్
సాకల్యంబు వహించు నాగమణి! రాజయ్యా! భవద్వర్తనఁ.

మృగ్యం బీవిధి నీడు జోడు నెనయా, మేలైన బంధంబు; సౌ
భాగ్య శ్రీమతి నీకుఁ దక్కినది; విశ్వాసంబునం దన్మనో
భాగ్యంబుం జవిచూచి, చూఱగొని, దివ్యంబైన నిక్షేపముల్
యోగ్యశ్రేణి ఘటించి పెంచి చిరకీర్తుల్ నింపు శిష్యోత్తమా!

మీ గార్హస్థ్య పవిత్ర సీమలను మీమీ యౌవనానం భోదముల్
సాగింపంగ స్వధర్మ వృష్టులు, చతు ర్వర్గంపు సస్యమ్ములఁ
దూగాడించి, యశస్సు రాసులిడి, యెందుఁ దివ్యభోగమ్ములఁ
జాగా భాగము గొందు నాగమణి!, రాజయ్యా! చిరంజీవులై

పలుకుం బొందిక, కార్యశూరత, దయా భావంబు, సంతానముఁ
తిలకింపఁ భవదీయముల్ భరతమాతృ స్ఫారహాసంబు, త
ద్గల ముక్తావళి, తన్మనో మధువు, త త్పాదాబ్జ పత్రంబులై
తలునల్ గొల్పెడుఁగాక నాగమణి!, రాజయ్యా! అశాంతకమఁ

నాగమూర్తి చేత నయ నిధానమ్ము చేత,
పరసహృదయుని చేత రాజయ్య చేత,
వైదికాదర్శ ఫలగార్హ పత్యలతిక
పెంపుగని పూల గుమ్మటమ్ముగఁ దనర్చు.

---

శుభమస్తు

నాగమణి, రాజమౌళి వివాహ సమయములో

# నవరత్నమాల

—— :o: ——

రచన: ఆకెళ్ళ సుబ్రహ్మణ్యకవి వా. సా. క. పీఠం

పద్మా శంకర శ్రేష్ఠి వంశ జలధిన్ ప్రాదుర్భవంబంది శ్రీ
లబ్బన్నాగమణీ! మహోజ్జ్వలగుణా ప్తప్రాజ్ఞవై లోకముల్
తబ్బిబ్బౌ సముదాల శీలవతి నీ ధర్మ ప్రభాశోభతే
ఉబ్బన్ కాంతి గృహస్థ జీవనమునన్ ఊగించుమా నీపతిన్

నీల గగనమ్ము తారాగణాల నొసగె
జలధి తుంగ తరంగాల చలన మొసగె
ప్రకృతి పుష్ప పరిమళాల సుకృత మొసగె
నాగమణి వంశ కీర్తి నాణ్య మొసగె

శ్రీ రామా బుత్రుడిపో
సాహస్సిక సత్కళా విశారద రథియై
విదసజ్జుడు పద్మా శం
కరవరు డిదినాడు పెండ్లి కాంతుల వింతల్

## గేయం

చాందినీల చంద్రకళలు
చంద్రకాంత మణి తళుకులు
చందనాల మెళకువలు

సంపెంక మధుకళికలు
పెండ్లిపూల పందిరిలో
ప్రేమపూచె మరందాలు
పసు[illegible]ంతపు కాంతులు
సన్నాయిల సంగీతాలు
వినోదాల విరిబంతులు
విశ్వమంగళ న్యవంతులు
పెండ్లి పీటలపై నగవులు
ప్రేమ దంపతుల బిగువులు
కవితేజాని సుత్రాలకు
కన్నెల విడు[illegible]లకు
గాయకు గళరాగాలకు
కళాశిల్ప చిత్రాలకు
పెండ్లి తోరణాల పుష్పాలు
ప్రేమ కంకణముల [illegible]

౨

మూగసిగ్గుల కన్నె ముద్దు చూపులవన్నె
రాగాలాపకంఠివై మ్రోగించె ప్రణయవీణ
నాగ స్వరమూర్తివె నాగమణి నీలోన
భోగభాగ్యములందు హాయి ఓ రాజయా !

చిలుక గోరింకలటు చిన్నారి పొన్నారి
చిఱుత వలపులలోన సిగ్గుదొంతరలోన
నాగమణి భావాను రాగంపుమూర్తియై
నటియించు నీలోన నవవరా రాజయా !

శుభమస్తు.

నాగమణి, రాజయ్యల వివాహ సమయములో

# నవరత్న మాలిక

—— :o: ——

రచన: ఆకెళ్ల సుబ్రహ్మణ్యకవి రా. సా. క. పీఠం

పచ్చా శంకర శ్రేష్ఠి వంశ జలధిజా ప్రాదుర్భవంబంది శ్రీ
లబ్బినా నాగమణీ! మహోజ్జ్వలగుణా క్షమాప్రాజ్ఞవై లోకముల్
తబ్బిబ్బౌ సమయాల శీలవతి నీ ధర్మ ప్రభాశోభతే
ఉబ్బన్ శాంతి గృహస్థ జీవనమునన్ ఊగించుమా నీపతిన్

నీల గగనమ్ము తారాగణాల నొసగె
జలధి తుంగ తరంగాల చలన మొసగె
ప్రకృతి పుష్ప పరిమళాల సుకృత మొసగె
నాగమణి వంశ కీర్తికి నాణ్య మొసగె

శ్రీ రామా బుక్కుడిపో
సాహస్యశ సత్కళా విశారద రథియై
సదసజ్ఞుడు పచ్చా శం
కరవరు డిడినాడు పెండ్లి కాంతుల వింతల్

## గేయం

చాందినీల చంద్రికళలు
చంద్రకాంత మణి తళుకులు
చందనాల మెళకువలు

చంచరీక మధుకళికలు
పెండ్లిపూల పందిరిలో
ప్రేమపూచె మరందాలు
వస్త్రోత్తంతుల కాంతులు
విద్వాంసుల శుభాకాంక్షలు
వినోదాల విరిబంతులు
విశ్వమంగళ స్రవంతులు
పెండ్లి పీటలపై నగవులు
ప్రేమ దంపతుల బిగువులు
కవిలేఖిని ముత్యాలకు
కన్నెల చిరునృత్యాలకు
గాయకుల గళరాగాలకు
కళాశిల్పి చిత్రాలకు
పెండ్లి తోరణాల పచ్చలు
ప్రేమ శింజానముల వెచ్చలు

౨

మూగసిగ్గుల కన్నె ముద్దు చూపులవన్నె
రాగాలాపకంఠియై మ్రోగించె ప్రణయవీణ
నాగ స్వరమ్మూదె నాగమణి నీలోన
భోగభాగ్యములందు మోయి ఓ రాజయా!

చిలుక గోరింకలటు చిన్నారి పొన్నారి
చిఱుత వలపులలోన సిగ్గుదొంతరలోన
నాగమణి భావాను రాగంపుమూర్తియై
నటియించు నీలోన నవవరా రాజయా!

నిరుపేద కడుపులో నకుతూవడిన నరాల
అరుణా మంగళరేఖ నటింపగా జాలి
తరుణ కవిని చూచు దారిద్ర్యమే కూల
పలుగునను నాగమణి ఛాయనిలు రాజయా!

నవనాట్య లోకమ్ము యౌవనాభ్యుదయమ్ము
జనసత్వ భావమ్ము శ్రమికజయ జీవమ్ము
కొమ్మ కొమ్మల పికము రెమ్మ రెమ్మల అళియు
కమ్మని గీతాల జిమ్ము మీ చరితమ్ము

ఓ నవవధూ! నాగమణి
ఓ నవవరా! రాజయా

పద్మా శంకర పుత్రికి
వరుడు రాజలింగ పుత్రుడు
ఉబ్బె దేవతా గణము
ఉజ్వల మీ కల్యాణము
తేజ మొసంగ నాగమణి
దివ్య వివాహ మనోజ్ఞ వేదిక
భ్రాజయ మంగళ ప్రదవి
రాజిత ధార్మిక కంఠ సూత్ర వి
భ్రాజిత హస్తమస్తక శు
భాకృతి మూర్తియునై సుఖాప్తిని
రేజ కళా పరిమళవ
రిష్ఠుడు నూతన దంపతుల్సుఖుల్
మంచి వియ్యమందె మా సెట్టి రాజలిం
గమ్ము గుప్త నెమ్మి కరము మెరయ
ప్రథిత కీర్తిగాంచె పద్మాన్వయ శ్రేష్ఠి
శంకరార్య నేడు జయమునంగ

ప్రాణేశు నెద వీణె పలికించు వాణివై
తీయని పాటల హాయి దేల్చి
అత్తమామల చిత్త మలరంగ లక్ష్మివై
సుఖ సంపదల గూర్చు చూపు తూపు
తల్లి దండ్రుల పుణ్య ధర్మాల గిరిజవై
నిత్య సౌభాగ్యంపు సత్యనిరతి
చెలికత్తె లెల్లరు సిగ్గిలన్భారత
మాతృహృదయ మొప్ప మాటతేట
పుట్టినింటికి వెల్గులు వెట్టితివిగ
అత్తయింటికి జిల్గుల నత్తితివిగ
ఇరుగు పొరుగుల తళ్కుల మెరసితివిగ
నాగమణిదేవి పతి ననురాగ వతిగ
గిరుల నుండి దిగుచు గిరగిర దిరుగుచు
సెలయేరు లత్తరు జిమ్మవచ్చె
తరుల కొమ్మలనుండి తలిరుటాకు వెణీగాలు
మావితోరణ మొప్పుచు మనగవచ్చె
నీల మేఘాకాశ బాలనక్షత్రాలు
దీపకాంతుల వెల దిద్దవచ్చె
మల్లె మాలతి జాజి మొల్లగులాబి సం
పగలు పూదండలు పంచవచ్చె
నిన్ను గన్నవారి వెన్నపూస మనస్సు
ఎన్ని మన్ననలను నీ వివాహ
వేళ నీ కొరకయి వేసట విసుగక
మధుర మొసగె నాగమణీ కుమారీ!
భాషా సేవకుడై కళాకృషికుడై భావాల సద్భక్తుడై
ఈష ద్వేషము లేక రామ పదమున్ ఏలించె పట్నాన్వయుం
డౌషారాగుడు ధార్మికుండు పితరుం డమ్మా! ప్రియుండీశ్వర
ప్రేషాధిక్యుడు నీవు నాగమణివే ప్రేమించు నిన్దైవమున్॥

శ్రీ రామజయము.

పాణిగ్రహణ మహోత్సవకాల మందొసగ బడిన,

మా కందపద్య

# పంచ రత్నములు

—— : o : ——

వి. నిత్యానంద,

శ్రీరామా! సుజనార్చిత!
సారసదళనేత్రపెండ్లి చక్కగ జేయన్
కోరిక లొసగుచు ప్రేమను
ధారసమొలుకంగబ్రోవు దంపతులమహిన్.

కన్నియ నొసగిన వారలు
సన్నుతిగను వరుని గురులు సౌఖ్యముగాంచన్
చెన్నుగ బ్రోవుము రామా
వన్నెయు వాసియును గాంచ వధువును వరుడున్.

కులశీల రూపములతో
వెలిసెడు దంపతులసౌఖ్య విశ్రుతకీర్తిన్
సలలిత పుత్ర ప్రాప్తిని
కలిమినొసగి బ్రోవుమయ్య కంజదళాక్షా.

పూర్వజుల సాంప్రదాయము
పూర్వముగా వెలయునీదు పుణ్యమునేడీ
పర్వమున నీకు పెండిలి
పార్వతి దీవెనలుకల్గి భాసిలె సుదతీ.

35

నాగమంబ! పరిణయమున
రాగ సుకవి పండితాళి రాణించెమహా
యోగము కల్గిన పొసగును
జగమున నిటువంటిగోష్ఠి సంపదయున్నే.

# శ్రీ శుభమస్తు.

# ఆశీస్సు

——o——

**నాగ్గం కృష్ణారావు**

క॥ అనయము వాగర్థంబుల
సమమున జతగూడి జగతి కంతయు జననీ
జనకులగు సుమాధవులిల
మనుతురుగావుత నవీన దంపతులదయన్.

సీ॥ శతమాన పరిపూర్ణ యుతచిరాయువొసంగి
యరసి బ్రోవఁగ జతురాననుండు
సాటివారలలోన మేటులౌ ననజెల్ల
దగినసంపద రమాధవుఁడొసంగ
శక్తిసంపన్నలక్షణ సమన్వితులగునట్లు
సదయుతఁ గనఁజేయ శంకరుండు
పరమ సదాచార పరత వర్తిల్లంగ
గురువు లాశీస్సులు గరుణఁజేయ

గీ॥ పుడమి దేవేంద్రుఁ డొసగంగ భోగములను
ధనదుఁ డెంతయుఁ దనయంత ధనికులనఁగ
ఆయురారోగ్య భోగభాగ్యములు గల్గి
ప్రతిభులగు గాత నూత్న దంపతులు ధరను

సీ॥ తమకులా చార ధర్మము దప్పకుండంగ
నవనిలో వర్తిల్లు నట్టి మేటి

పెద్దలఁ గనుగొన్నఁ దద్దయు భక్తిమై
గౌరవించెడు నట్టి ఘనుడనంగ
ఆంధ్ర సరస్వతీ యర్చనాధ్యాసియై
ధరఁ బేరుపొందిన గురు యశుండు
కవితా వినోదియై కవి పండితుల నర్హ
సత్కార మొనరించు సరసగుణుఁడు

గీ॥ బందుగులఁ బ్రీతిఁ జూచెడు వాఁడనంగ
స్నేహ పాత్రుఁడనంగఁ బ్రసిద్ధుఁడనగ
పబ్బ వంశపయోధిజై వాత్మజుఁడన
నుండు శంకరశ్రేష్ఠి వంద్యుండుగాడె॥

---

శ్రీ ర స్తు

# ఆ శీ ర్వ చ న ము

—— :o: ——

బి. వెం. గుప్త

కం॥ శ్రీ తనరెడు మంటపమున
గీతా సుకవిత్వ వాద్య ఖేలన శుభహా
రతులఁ శోభిల బ్రాహ్మణ
తతులుఁ మంత్రార్థములను తగువిధి బల్కఁ

కం॥ నందన సంవత్సరమున
వందిత వైశాఖమాస బహుళము నందుఁ
అందమగు విదియ తిథినిఁ
పొందుగ కర్కాట లగ్న పుష్కర ఘడియఁ

కం॥ విద్యుల్లత నాగమణిఁ
విద్యానిధి రాజుకిచ్చి వేడుకలెల్లఁ
హృద్యంబుగ సల్పి ధరఁ
సద్యశమును గాంచినాడు సరసులు మెచ్చఁ

కం॥ అన్నార్తుల కన్నంబును
పన్నుగ కవి పండితులకు బహుమతు లిడియుఁ
మన్నన బంధుల కొప్పగ
అన్నాయన కట్నములను అల్లున కిచ్చెఁ

కం॥ లిబ్బి పతి బోలు కూతున
కబ్బురముగ పెండ్లిజేసె సాలంకృతగన్
పశ్చా శంకర యార్యుడు
నిబ్బరమగు చిత్తవృత్తి నిర్మల భక్తిన్

కం॥ వైదిక ధర్మ ప్రియుడని
పేదల పాలిటికి నితడు పెన్నిధి యనియున్
పదుగురు బొగడగ గనియిడె
ఆదరముగ వెంకటేశు డాశీర్వచనాల్॥

---

శ్రీ శుభమస్తు.

# శు భా శీ స్సు లు

—— :o: ——

## బలభద్రపాత్రుని శ్రీకృష్ణారావు,

నల్లకుంట ; హైదరాబాదు (ద)

శ్రీ గరుడధ్వజుం డమిత
శ్రీ గూర్మి నొసంగిం బ్రోచు శీలయుతుల నీ
నాగమణీ రాజయ్యల
భాగస్వాములను గార్హ పత్యము నందున్.

రంగ మహీశు కొమ్మ జిగి రంగుల పుత్తడిబొమ్మ, విష్ణు న
ర్ధాంగి, యనారతంబు పతి రాజును బాయని వన్నెలాడి, నె
మ్మంగ రుణించియిచ్చుత న మేయశుభంబుల,నూత్నదంపతుల్
రంగుగ గూడి రంజిల ని రంతర మిద్ధర కీర్తిసాంద్రులై.

కలుముల చేడె నిన్నెపుడు కంటికి ఱెప్ప విధాన గావగా
పొలంతి భవాని నిచ్చలును భూరి యశస్సు ఖరాజిం బెంపగా
నలరుము నాధు సంగతి, స ముంచిత ప్రేమ సుధాబ్ధి డోలలన్
సలలిత భక్తి నాగమణి! సాధ్వివనన్ జగతిం బ్రసిద్ధవై!

భవురాణి పోలిక భర్త కర్ధాంగివై
పతిప్రాపు విడువక వరలుమమ్మ
నారాయణి విధాన నాధుని మదికెక్కి
విభుని హృదయపీఠి విడువకమ్మ

పల్కుల చెలి రీతి పతివాక్కు నీదిగా
    మచ్చిక నిరతంబు మసలుమమ్మ
ఇంద్రాణి వలె సకలేప్సితార్థంబుల
    కాంక్షాధికమ్ముగా గాంచుమమ్మ

సీత, దమయంతి, సావిత్రి, శీలవతుల
జాడ, భారతీ యాదర్శ సాధ్వవగుచు
నాగమణి! ఆయురారోగ్య భోగములను
దనియు మమ్మ, ఆ రవిచంద్ర తారకముగ

వంశ మర్యాద లెప్పుడును వదలకుండ
ఆశ్రితాతిథి వర్గంబు నాదరించి.
సాటి స్త్రీజాతి కెల్లను మేటి వగుచు
నాగమణి! పొందు, మానంద నందనమ్ము!

శ్రీరస్తు.

మ॥ రా॥ శ్రీ పబ్బా (చంద్రా) శంకరయ్య కూతురు
నాగమణి వివాహ సందర్భమున ఆశీః పురస్సరముగా సమర్పిం
చిన పద్య సుమాంజలి.

# వైవాహికాశీః

# పంచరత్నములు

—— : o : ——

వధూవర శ్రేయోఽభిలాషి ;
**కేశవపంతుల నరసింహశాస్త్రి**

శ్రీ జనకాత్మజా కరకుశేశయ యుగ్మముఁ జేర్చఁగెంపులై
రాజిత రాశ చంద్రమణి రంజిత మౌళిని మొల్ల మొగ్గలై
భ్రాజిత నీలదేహ రుచి భాసురతన్ హరినీల పంక్తియై
రాజిలు జానకీ రఘు వరప్రథమాన వివాహ మంగళ
శ్రీఁ జెలువొందు ముత్తెములు శ్రీలిడిప్రోచు వధూవరద్వయిన్.

కరిరాజాస్యుఁడు, షణ్ముఖుండును, నిజాంకప్రాప్తిమై శుద్ధులన్
గురిపింపన్; శిరమందు గంగ కులుకన్; గోత్రాధరాధీశు కూ
తురు సామేన రహింప; సద్గుణ సనాథుండైన శంభుండు మే
ల్సిరిఁ జేకూర్చు నవీన దంపతుల కాశీస్సూనపుంజమ్ములన్.

సీ॥ పరమ పాతివ్రత్య భవ్యైక పత్నీ వ్ర
తముల సీతారఘూత్తముల బెడగు
సర్వమంగళత నఖర్వైశ్వరత్వంబు
నను బార్వతీశాన ఘన యశంబు

ధన్యకళావతీత్వ చతురాననతాగు
ణముల వాణీ శతానందులరహి
తతభాగధేయ సంగతివిబుధాశ్రయ
త్వముల శచీపురందరుల గరిమ,

గీ॥ గలుగ నతిలోక భోగభాగ్యములఁ జెలఁగి
పూవుఁ దావియుఁ దారంబు పూసలట్లు
నెగడుదురు గాత నాగమణీ పురంధ్రి
రాజయాఖ్యులు దాంపత్య రసము నెఱిఁగి.

పతి శుశ్రూషలఁజేసి, యత్తలను సేవావృత్తి మెప్పించి, యు
న్నత విద్యా పరిశీలనంబున సతీ న్యాయంబుఁ బాలించి, యే
కౌతుకఁ బుట్టిం యింటవారలకులేకుండఁ సుఖంబుంధుమా
యతలక్ష్మీవిభవాప్తి నాగమణి కన్యారత్నమా ! ప్రీతిమై॥

కం॥ పురుషాయుష జీవులు, భా
సుర రూపులు, భాగధేయ సుత్రాములునై
సరివారి మించు కొమరుల
పర గుణులఁ గనుఁడు; మనుఁడు వత్సరశతముల్.

శ్రీరస్తు.

# పరమ హితోపదేశక
# పంచరత్నములు

—— :o: ——

పరమ హితోపదేశకః,
ప్యారకపురి భట్టర్,
శ్రీరామాచార్య సిద్ధాన్తిః
శ్రీ వైదిక ధర్మ ప్రచారిణీ, పండిత పరిషత్స్థాపకః,
ఆర్షవైదిక గ్రన్థమాలా సంపాదకః
ముముక్షు శరణమందిర సంచాలకః.

ది॥ 18-5-1952 నందన వైశాఖ బ॥ ౧౦ భానువాసరః.

శార్దూల విక్రీడిత ఛందః.

శ్లో॥ మేధావీ మధురోక్తిభిః పతి మనస్సౌభాగ్య సంచారిణీ
భూమానంద నికేతనా గురుజనప్రేమోల్ల సద్వర్తనా
సద్భావా సమయోచితోక్తి నిపుణా సౌశీల్య సీమంతినీ
సీమా ధర్మపరా సుధీవినుత పద్మా శంకరాఖ్యాత్మజా!

ఆర్యా ఛందః

శ్లో॥ నాగమణి ర్నాగమణిః, మాణిక్యమణి ర్నాగమణిః ।
మణిహారీ రాజైపస్యా, దితి రాజయాఖ్యోవరో యుక్తః

అ. తి. చ్ఛ ం ద ః

శ్లో॥ శంకర మాధవ సేవా సౌఖ్య వివర్ధితధిషణా సంతతమస్తు
స్వయమపిగృహిణీచిత్తవిహారీ శ్వశురగృహేనమ్ముదితోవిహర॥

అ ను ష్టు ప్ ఛ ం ద ః.

శ్లో॥ చన్ద్రశేఖర సంపత్తి జ్ఞాన వైరాగ్య సంయుతః ।
సాంవత్సరం రాజధారి చే త్ప్రార్థోభవతి శంకరః॥

శార్దూల వి క్రీ డి త ఛ ం ద ః.

శ్లో॥ అశాస్తేపిచ పుస్తకాపణ గృహం తత్కార్యవర్గో మహాన్
తత్కర్త్రీ ప్రభవిష్ణు గీష్పతి సమశ్శ్రీ అప్పయాఖ్యస్సుధీః
తత్సంకల్పచరః కృతీ గుణధి పబ్బా శంకర స్తన్మనః
ప్రేమాధీనమభీ స్తథాహ మనయోః కల్యాణగోష్ఠిశ్శుభా॥

అ ను ష్టు ప్ ఛ ం ద ః

శ్లో॥ నాగమణి రాజయాఖ్యో రేతయో రన్వహం సుఖమ్ ।
పూర్ణం భూయా త్పుత్రపౌత్రై ర్దేవదేవ ప్రసాదతః॥

---

శుభమస్తు

# ఆశీర్వచనము

—— :o: ——

చిగురుపాటి సుబ్రహ్మణ్యకవి

శ్రీరఘురామ పాద సరసీరుహ యుగ్మము నెల్ల వేళలన్
కోరి భజించుచు న్స్వజన కోర్కెలనున్ దెలిదమ్మిగద్దెపై
చేరిన కొల్వు రాయునికి చేడియ లచ్చికి కోశలాటనిన్
పేరిమిజోడు బ్రోచుత యుపేక్ష మనన్ కవి పల్కు శంకరా॥

కూతుర పెండ్లి కావ్యమును కూర్చిని కైత పఠింప కోర్కెచే
యాతయ టన్న మాటకు ప్రయుక్తినిటన్ ఒనగూడెగావునన్
భూతి దలిర్ప నాగమణి పుణ్యఫలంబన రాజయాఖ్యతో
నీతికి సాటి లోకము మనీషి జెలంగగ దేలియాడుతన్॥

గౌనముల మొల్కనై తసర కుంకుమ శోభితురాలవై తలం
గొని పతిలోలవై యలర కోమలి పుణ్య సతీ స్వభావ వ
ర్తనమున పూర్వ ధర్మముల తల్లిరొ నాగమణీ! చరించుచున్
కనుపడి సేమమార కలకాలము ఐదువవై సుఖింపుమా॥

పరమోత్కృష్ట గృహస్థ ధర్మమిది దర్పంబొప్ప దీక్షాత్స భా
స్వర మందాదృతి స్వీకరించితివి మోదంబెంతో చేకూరె సుం
దరగాత్రిన్ సుకుమార నాగమణి డెందంబందు రంజింప నీ
కరయే మున్నది సార్ధకాఖ్య గొనుమయ్యా రాజయార్యాన్వయా॥

హితమై సతతము నెలగ
మతమౌ మన ఆర్షచరిత మానిత నుడులన్
వితతిన్ సతిపతు లియువురు
మతితో చేకూర్చి మెలగ మాయాశీస్సుల్॥

శు భ మ స్తు.

చిరంజీవి సౌభాగ్యవతి నాగమణి, చిరంజీవి మాశెట్టి రాజయ్యల
వివాహ శుభ సందర్భమున గూర్పఁబడిన

# కల్యాణ గోష్ఠి యందు

నూతన వధూవరులకు ప్రేమాశీర్వాద పురస్సరముగా
నొసంగఁబడిన,

# ప ద్య ర త్న పం చ క ము

— o —

భీమవరపు సాంబశివశర్మ

శ్రీరామాపురుషోత్తముల్, గిరిసుతా శ్రీకంఠులున్ శారదా
నీరేజాసను, లీ వధూవరులకున్ దీర్ఘాయురారోగ్య సౌ
ఖ్యారూఢిన్, హితసంతతిన్, బహుళవిద్యాసంపదాప్తిన్ యశః
పారమ్యంబునుఁగూర్చి ప్రోతురెప్పుడున్ భద్రాను సంధాతలై

నాగమణీ కుమారిక ! వినంగదవమ్మ హితోపదేశమున్
బాగుగ; నీకు, నీకులము వారికి నెట్లు సుకీర్తిగల్గు, నే
లాగున జీవితమ్ము సఫలంబగు; నట్టులు నీదు వర్తనం
బోగుణరాశి! దిద్దుకొను మోపిక తోడుత మేలు గల్గుతన్॥

చదువుకొన్నట్టి వాడవు సద్గుణుఁడవు
గాన వేఱుగఁజెప్ప నక్కఱయె లేదు;
కాని చెప్పెద సత్పథ గామివగుచు
నీవు మామను మించి మనీషి వగుము !
రమ్యగుణధుర్య ! మాశెట్టి రాజయార్య !

మీ వివాహ మెందఱకో సంప్రీతికరము
గాగ జరిగిన, దటులె మీ గార్హపత్య
జీవితము కూడ బహుజన జీవ్యమగుచు
నెసక మెసఁగుతఁ జిరకాల మింపునింపి!

మనుజు లిల సంఘ జీవను లని యెఱింగి
పరసుఖము నడ్డువెట్టని భంగి స్వీయ
వర్తనము జక్క దిద్దుకో వలయు నెఱిగి
యిహ పరమ్ములు మీరు సాధింత్రుగాత!

---

శ్రీ రస్తు

# వివాహ మంగళ పద్యాని

—:o:—

శిరోమణి విశ్వనాథశర్మ (శివంపేట)

శ్లో॥ వివాహ విద్వత్పరిషన్నిషణ్ణౌ ।
విద్వత్కృతాశీర్వచనాభిరామౌ॥
వధూవరౌ నాగమణీశ్వరీ శ్రీ ।
రాజేశ్వరౌ సంతు సదా సహామే॥

శ్లో॥ సమ్యక్ ప్రసన్నాదిమ దంపతీభ్యాం ।
వివాహ సుశ్రీకృత మంగళాభ్యామ్॥
వధూవరాభ్యాం వరవో యువాభ్యా ।
మగ్నిప్రపత్స్యద్గృహ గార్హపత్యః॥

శ్లో॥ విశుద్ధమేత ద్విదితం వివాహో ।
విచ్ఛిద్యతే చేతి సతాం యుతస్తత్॥
దాంపత్య మచ్ఛేద్య మవాప్త యోర్వా
మాయుష్మతో స్స్వస్తి దిశంతు దేవాః॥

శ్లో॥ నూజాతు గార్హస్థ్య మపే మపాఠ్యా ।
దంతం సు శూన్యం యువయోః ప్రజాభిః॥
వివాహ సాఫల్య మభిప్రదృష్టం ।
ధర్మ ప్రజా సంపది కేవలం యత్॥

శ్లో॥ యేనాఽగమం స్త్వ త్పితరశ్చ పూర్వే ।
పితామహాస్తే నగతా సరిష్యతః॥
అపీష్యతే కోఽపిరసోఽను భోక్తుం ।
ప్రపద్యతా మద్య సతాం సపంథాః॥

శ్రీ

# దీవన పూలు

## వేముగంటి నరసింహాచార్యులు (సిద్ధిపేట)

చ॥ చిన్నపు వయస్సులో మధుర శీధువు జిమ్ము రసానుకూలవా
ర్థమగు వర్తనంబున నిరంతరముగ్ధ మనోజ్ఞభావనా
ప్రవహితజెంది కూర్మి మెయి బంధువులున్ ప్రసుతింప నీనవో
త్సవపు వధూవరుల్ సుఖవిశాలురునై విలసిల్లు గావుతన్॥

మ॥ జిలుగుంబట్టు లపూంతతో సుకవులాశీర్వాదముల్ వేయ మం
గళ రూపమ్ములతోడ చూపరుల నాకర్షింపుచున్ లేత న
వ్యాలరన్ మోములయందు; నాగమణి రాజాఖ్యులీదంపతుల్
వెలుగుం బాటకు శ్రీస్పృశాంచరిత భావిన్ జీవితాదర్శమున్॥

తే॥ గీ॥ పూవుచు విపని మేలిమి తావివోలె
చందమామను వెన్నాడు చంద్రికవలె
నీ యనుగుపతి నెప్పుడున్ విడువకుండ
కొత్తకాపురమును దిద్దుకొనుము నీవు
నాగమణి వధూరత్నమా! రాగమలర.

శుభమస్తు

నూతన వధూవరులగు చిరంజీవి రాజయ్య,

చి॥ సౌ॥ నాగమణికి గూర్చిన

# ఆశీర్వచన పద్యములు

—— :0: ——

## ఉప్పల చంద్రశేఖరగుప్త

సిరిగల దివ్య జన్మగుణ సీతను బెండిలియాడ నిచ్చతో
సరసుఁడతఁ డొకండై శివ ధనస్సును ద్రుంచి సుకీర్తినొప్ప నా
పరమపవిత్రభావములగు భక్తులఁబ్రోచెడు రాముఁడీ వధూ
వరులకు నిచ్చు గావుత నపారిత కీర్తి సుఖాభిలాషలన్

అరయఁగ వృక్షము దావియు నలరు నటుల
చంద్ర చంద్రికా న్యాయంపు సరణి మిగుల
ప్రియమున నీ వధూవరు లతి ప్రేమతోడ
దనర నొప్పెదు నాచంద్ర తారకముగ.

లలితమగు రూపమందున లక్ష్మివగుచు
ధన్యతను గూర్చ నోర్పున ధాత్రివగుచు
మమత పోషణమందున మాతవగుచు
మంచి యాలోచనంబున మంత్రివగుచు

రసికతను గూర్చ శయ్యపై రంభవగుచు
పతికిఁ జేదోడు వాదోడు బరగి మిగుల
బంధువులు నిన్ను గొనియాడ భవ్యరీతి
కీర్తి గొనుబిడ్డ! సమయానువర్తివగుచు

చీటిమాటికి విసువ్వను జెందకుండ
పఱఁగనతె పతికి హితమైన పనులకెల్ల
కొన నీవనువున కాని దిరుపు మిగుల
వినుమి రాజయ్య హితవును వేడ్కమీఱ.

సీ॥ పతిప్రాణముల జమునిబారి దప్పించెను
వేడ్క సావిత్రి దేవిలలామ
రోగియౌ పతిని సరాగిగా నొనరించె
దేవి యా యరుంధతీలలామ
పఱగ త్రిమూర్తుల పసిపాపలను జేసె
శుభదయౌ యనసూయ లలన
కాననసీమల దనకష్టముల కోర్చె
ధన్యచరిత్ర సీతాలలామ

పతితపావన గంగా ప్రవాహమట్లు
లలిత తరపుణ్య వీచికా జాలములన
పరమ పూజ్యంబు సత్సతీ చరితమెల్ల
జగతి నీవట్లు వెలయుము నాగమణిరో !

పుట్టినింటికి మెట్టి నింటికిని గీర్తి
మెచ్చ జరియించి బంధుగుల్ మెచ్చురీతి
పెద్దలందును భక్తియు పిన్నలందు
దయ యుదారగుణముగల్గి దగుముతల్లి !

శ్రీయుత రాజయామాత్య గుణశీల సతీమణి నాగమాంబ, నీ
ప్రేమనిగాగ సంతసము జేవిధులఁ గాని నీదుసేవలఁ
జేయగ నాతురించె, కమ స్వీకృతిజేయుమి; ఆదరింపుమీ
బాయని ప్రేమబంధుగుణ ప్రస్తుతిసేసి భళీ! యనఁగదుఁ

శ్రీ శుభమస్తు.

# ఆశీస్సు

— o —

## ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు

క॥ శ్రీ శంకర మౌళి ధృతా
కాశావత రామరాపగాకాశంబై
ప్రాశస్త్యముఁ బడయుత ప
బ్బా శంకరపు గురుపదాన్య పరిణాహంబుల్

శా. అన్యాధీనముగాఁగ దానము లిసత్ ఖ్యాకమ్ములం జేసినన్
మాన్యంబయ్యెడుఁ గాక, కల్గదిఁక సంబంధములే దాతకున్
అన్యోన్యాదరణానురాగములు ధన్యత్వమ్ము న్వాంతమీ
కన్యాదానముఁగూర్పఁ దక్ష్యముగ శ్రీకాంతున్ మదిన్ వేడెదన్

గీ॥ రాజశేఖర శంకర విరాజమాన
నాగరాజ్ఞీలలామ విన్యాసమొంది
హృదయ కౌముదియౌత రాజేశ్వరునకు
నాగమణి ప్రభలమీఱ యీనాఁటినుండి

ధనవంతుల్ ఘనమైన భోగము లమందానందమందింప నె
మ్మనమందం జొన్పరు విద్యదుక్తులను నామాటల్ మృషల్గా వధూ
జనకోత్తంసుఁ డొసఁగ్చె శంకరయ యీ చందాన నుద్వాహమున్
ధనవిఖ్యాతి శయమ్ముల న్మెరసి యీ దాంపత్య మేపారుతన్.

క॥ మంగళ తూర్య వినాదము
లంగణమున మ్రోఁగుచుండ ననవరతంబున్
శృంగారపు సంగాత మె
సంగుత వీరలకు నర్థ సంతతితోడన్

శ్రీ ర స్తు.

పురోహితుఁడగు సహజకవి నారాయణం రాజనరసింహరాయశాస్త్రి
గారికి 216రూపాయలు కానుకలతో సన్మానించిన సందర్భములో
శ్రీ శాస్త్రిగారు బహూకరించిన,

# ఆ శీ ర్వా ద ప ద్య ము లు

—— :o: ——

## నారాయణం రాజనరసింహశాస్త్రిగారు

శ్లో॥ శుభమ స్త్వవిఘ్నమస్తు శ్రీరస్తు చిరాయురస్తు విజయోస్తు
అస్తు ధనధాన్య సంపత్శ్రేయో విద్యాది సకల సంసిద్ధిః॥

పబ్బా శంకరు డెంతయు
నబ్బిన తన కలిమికొలఁది నాప్తులు మెచ్చన్
యబ్బురము పడగ బంధుగు
లుబ్బుచు సాలంకృతముగ నొసగెన్ కూతున్

వేదానుసరణి మంగళ
నాదాదులు మ్రోయబుధజనాళికినెంతే
మోదావహమై తగు క
న్యాదాన మొసంగి వాడ వర్యులు పొగడన్.

పెండిలి మండపమున గడు
నిండగు సందడిని వేడ్క నేఁడిట జూడన్
నిండెను బండిత మండలి
దండిగ దీపన లిడంగ దంపతులకుగాన్

అబ్బుర మానస్సులలరఁ
కబ్బములు రచించిపెట్టి తమ్ములు ఘనజ్ఞుల్
అబ్బె నిపెండ్లియను పలుపగ
పబ్బా శంకరునకమిత భాగ్యములొదవన్

జననీ జనకుల నఘవతి
తనుగుణమునుగ నత్తమామలను సత్కృతిన్
వినయమునను సేవించిన
గనుడువు నాగమణి సుఖము ఘనమగు యశమున్.

నిగమాగమ కోవిదులును
జగమున తారులగు తమ్ములు జదువరులు బుధుల్
దగ నాశీర్వాదించుట
భగవంతుడు దంపతులకు భాగ్యములిడున్

కవితా గానములో గల
చవి పబ్బా శంకరయుతు సంక్రమమగుటన్
ప్రవిమలమగు కీర్తి సతిన్
దవులుకొనిని పొగుడు పెంపు వలపున భళిరే

పందిరులు వేయుచుందురు
విందులు సలుపుదురు వెలుగు వేడుకజూడన్
మందులు గాల్తురు సుకవుల
సందేశము దంపతులకు సమకూర్పర హో

ఎందఱు ధనవంతులు గల
రందరికీ బుద్ధిగలిగి రాజిల్లుటకై
ముందంజ వేసినాడవు
సందియ మిసుమంతలేదు సహజమె నీకున్

శ్లో॥ భూతేశః పరమేశ్వరః పశుపతి
ర్భూతి ప్రియశ్శంకరః
కారుణ్యానిధికః ప్రకాశకరుణా
మౌళిర్గుణాంభోనిధిః
వామాంగే హిమవద్గిరీశ్వర సుతా
గంగాకపర్దీవృతః
కల్యాణోత్సవ తత్పరస్య భవతాం
కుర్యాత్సదా మంగళం॥

---